# ఎర్రాప్రెగడ

ర చ న :

ఆచార్య వి. రామచంద్ర

సంపాదకులు :

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు




ప్ర చు ర ణ :

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు



# సందేశం

నిద్రాముద్రితమైన జాతిని జాగృతం చేసి, భద్రాయిత మూర్తిగా తీర్చిదిద్దిన మహావ్యక్తుల పవిత్ర జీవిత చరిత్రలు మన చిన్నారులకు ఉత్తేజకారకాలు; ఉత్సాహప్రేరకాలు. రేపటి పౌరులైన బాల బాలికలలో మంచి నడవడినీ, గట్టి పట్టుదలనూ, కలిసికట్టుతనాన్నీ, దేశభక్తినీ, సేవాసక్తినీ, మాతృ భాషానురక్తినీ పెంపొందించడానికి ఈ రీతి రచనల ప్రచురణ ఎంతైనా అవసరం.

ఈ గ్రంథ పరంపర ప్రచురణకు రూపకల్పన చేసిన తెలుగు విశ్వ విద్యాలయం వారికి మనఃపూర్వకమైన అభినందనాలు; ఉత్తమాశయ మహితమైన ఈ ఉద్యమంలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను భాగస్వామ్యం వహించిన సంస్కృతి ప్రియులకు సాహితీపరులకు కళాభివందనాలు.

హైదరాబాదు,
విభవ ఉగాది,
మార్చి 18, 1988.

'కళాప్రపూర్ణ'
**నందమూరి తారక రామారావు**
కులాధిపతి, తెలుగు విశ్వ విద్యాలయం



ఆచార్య తూమాటి దొణప్ప
ఎం.ఏ, పిఎచ్.డి, డి.లిట్.,
కులపతి,
తెలుగు విశ్వవిద్యాలయం.

# ఆముఖం

తెలుగుజాతికి మహోజ్జ్వలమైన చరిత్ర ఉంది. విశాలమైన ఈ తెలుగు నేలను ఎందరో రాజన్యులు పరిపాలించారు. మరెందరో మాన్యులు, మహనీయులు దీనిని సుస్థిరమే కాదు సుసంపన్నం గావించారు. రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా, సాహితీ సంస్కృతి పరంగా, మత సామరస్యంతో ఆంధ్ర దేశాన్ని పురోగమింపజేశారు.

పరికించి చూస్తే ఇక్కడ ప్రతి రంగంలో ఒక యుగకర్త కనిపిస్తాడు; ఒక తేజోమూర్తి దర్శనమిస్తాడు. అపూర్వమైన సాహితీ సృష్టితో తెలుగు సాహితీ మంజూషను మణి

మయం చేసిన కవివరేణ్యులు; పద సాహితీ సంపదతో తెలుగు నేలను సరస సంగీత స్వర గంగాతరంగితం చేసిన వాగ్గేయకారులు; నూతన నృత్య వైయాత్యాలు అందించిన నాట్యాచార్యులు; అనల్పకల్పనా చాతురీ మహిమతో శిల్ప ప్రాభవాన్ని అందించిన శిల్పి శేఖరులు; నాటక రంగాన్ని శిఖరాయమాణం చేసిన నటశిఖామణులు; జాతీయోద్యమాలలో నడుం బిగించి ముందుకు దూకిన వీర యోధులు; చీకటి క్రమ్ముకొన్న వేళ జాతి యావత్తు సుషుప్త్యవస్థలోకి జారిపోయే టప్పుడు వెన్నుతట్టి, మేల్కొలిపి, చేయూత నిచ్చి, జాతిని చైతన్య చకచ్చకితం చేసిన వైతాళికులు; తమ అమేయ మేధాసంపత్తితో, ఆధునిక విజ్ఞానశాస్త్ర సారంతో ఆంధ్ర దేశాన్ని వ్యావసాయికరంగా, పారిశ్రామికరంగా ప్రగతిపథంలోకి నడిపించిన విదేశీయులు, స్వదేశీయులు; మత సహిష్ణుతను పెంపు చేసిన మహానాయకులు, చరిత్ర పురుషులు ఎందరో ఉన్నారు.

ప్రాతఃస్మరణీయులైన ఈ మహనీయుల విగ్రహాలకు రూపకల్పన చేసి సమవేదికపై

ప్రాణప్రతిష్ఠ గావించి సజీవ మూర్తులుగా 'తెలుగు వెలుగులమూర్తి నిక్షిప్త కళా ప్రాంగణం' పేరిట హైదరాబాద్‌లోని ట్యాంక్ బండ్‌పై నెలకొల్పిన ఘనులు, యశోధనులు మన ప్రియతమ ముఖ్యమంత్రి మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారు.

ఈ తెలుగు వెలుగుల జీవిత విశేషాలను అక్షరబద్ధం చేయాలని మేము సంకల్పించాం. ఇవి భావితరాలను ప్రభావితం చేస్తాయనీ, చక్కటి స్ఫూర్తి నిస్తాయనీ మా విశ్వాసం. అందుకే ఈ ప్రాంగణంలోని ప్రతి మూర్తి గురించి సరళ శైలిలో క్లుప్త చరిత్రను రచింపజేసి 'తెలుగు వైతాళికులు' పేరిట లఘు రచనలుగా వెలువరింపజేశాం. ఇందుకు తమ తోడ్పాటును అందజేసిన రచయితలకు మా కృతజ్ఞతలు. ఈ పుస్తక పరంపరకు సంపాదకులుగా వ్యవహరించి మాతో సహకరించిన శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారికి మా ధన్యవాదాలు!

తేదీ 5-3-1988,
హైదరాబాద్-500 004.

తూమాటి దోణప్ప

# ఎర్రాప్రెగడ

ఎర్రాప్రెగడ పేరు చెప్పగానే మనకు మహాభారతం గుర్తుకొస్తుంది. సంస్కృత మహాభారతాన్ని తెలుగు చేసిన ముగ్గురు మహాకవుల్లో ఎర్రన మూడవవాడు. మొదటివాడు నన్నయ. రెండవ మహాకవి తిక్కన. తెలుగుభారతం మొత్తం 18 పర్వాలుగా విభజింపబడింది. పర్వమంటే ఒక్కొక్క భాగానికీ పెట్టబడిన పేరు. ఆ పర్వాల్లో మొదటి రెండు - అంటే ఆది సభా పర్వాలను, మూడవదైన అరణ్యపర్వంలో సగ భాగాన్నీ నన్నయ భట్టు వ్రాశాడు. నన్నయ 11 వ శతాబ్దం వాడు. నాలుగవదైన విరాటపర్వంనుండి మిగిలిన 15 పర్వాలు తిక్కన వ్రాశాడు. ఆయన 13 వ శతాబ్దం వాడు. అయితే భారతంలో నన్నయ మిగిలించిన భాగం 250 సంవత్సరాల వఱకూ అలాగే ఉండిపోయింది. కారణాంతరాల చేత తిక్కన కూడా దాన్ని ఆంధ్రీకరించలేదు. మఱి తెలుగులో మహాభారతం ఒక పరిపూర్ణమైన స్వరూపం ధరించాలంటే అరణ్యపర్వంలో మిగిలిన సగభాగం తెలుగులోకి రావాలి. కాని, ఆ భాగాన్ని తెలుగు చేసే సాహసం అందరూ చెయ్యలేరు. ఎందుకంటే అది మహాకవులైన నన్నయ

తిక్కనల రచనలకు మధ్య మిగిలి ఉన్న భాగం. వాళ్ళంతటి కవికిగానీ దాన్ని ఆంధ్రీకరించే ధైర్యం ఉండదు. అందుకే ఎఱ్ఱాప్రెగడ పూరించేదాకా ఆ భాగం అలాగే తెలుగులోకి రాకుండా ఉండిపోయింది. ఎఱ్ఱాప్రెగడ అరణ్యపర్వశేషాన్ని పూరించి తెలుగు భారతాన్ని సమగ్రం చేసి నన్నయ తిక్కనలతో సమానమైన కవి అయ్యాడు. అంతేకాదు ఎవరైనా నన్నయ వదిలిన భాగాన్ని పూరించడానికి పూనుకోవాలంటే అందులో మఱికొన్ని చిక్కులు కూడా ఉన్నాయి. నన్నయ శైలి ఒక రకం. తిక్కనశైలి ఒకరకం. నన్నయది కథనాత్మక శైలి, తిక్కనది నాటకీయ శైలి. మరి నన్నయ వదిలిన భాగం ఈ రెంటికీ నడుమ ఉన్నది. నన్నయే ఆరణ్యపర్వాన్ని పూర్తిగా వ్రాసి ఉంటే, తరువాత భారత రచనను కొనసాగించేవాళ్ళను గుఱించిన బాధ ఆయనకు లేదు కాబట్టి తన ధోరణిలో తానా రచనను సాగించి ఉండేవాడు. కాని ఆ పర్వంలో కొంత భాగం మాత్రమే ఆయన వ్రాయడం జరిగింది. తరువాతి కాలంలో నన్నయ తిక్కనల రచనల మధ్య మిగిలి ఉన్న భాగంగా ఆరణ్యపర్వ శేషం తేలింది. అందుచేత దాన్ని పూరించడానికి పూనుకొన్న ఎఱ్ఱాప్రెగడకు అటు నన్నయ శైలికీ, ఇటు తిక్కన శైలికీ కలిసేటట్లుగా ఆ రచనను రూపొందించవలసిన అవసరం కలిగింది. మఱో విషయం నన్నయ్య తన రచనను తన ప్రభువైన రాజరాజ

నరేంద్రుని కంకితంగా ప్రారంభించాడు. అంటే, అరణ్య పర్వంలో నన్నయ వ్రాసిన తొలి సగం కూడా రాజరాజ నరేంద్రునికే అంకితమయిందన్నమాట! మఱి మలి సగాన్ని యేం చేయాలి? దాన్ని కూడా రాజరాజ నరేంద్రుడికే అంకితం ఇవ్వడం సబబు. అంటే దాన్ని వ్రాసిన కవి ఉదారాశయంతో చేయవలసిన నిష్కామ కర్మ అది. అరణ్య పర్వశేషాన్ని రచించడమంటే, అది యిన్ని చిక్కులతో కూడుకొన్న పని. కవు లనేకులుండవచ్చును. కాని వారిలో నన్నయ తిక్కనలతో సమానంగా వ్రాయగలమనే ధైర్యం, విశేషించి ఆ యిద్దఱు కవుల శైలులకూ అతుకుపెట్టగల శక్తి, ఒకవేళ ఆ విధంగా రచింపగలిగినా, దాన్ని నిస్స్వార్థంగా రాజరాజ నరేంద్రుని కంకిత మివ్వగల ఆత్మశక్తి, ఉదారమైన బుద్ధీ అందఱకూ ఉండవు.

ఈ అన్ని గుణాలు కలిగిన మహాపురుషుడు కావడం చేతనే యెర్రాప్రెగడ చేసిన అరణ్యపర్వశేష ఆంధ్రీకరణం అంత వన్నెకెక్కింది. అతడు కవిత్రయంలో ఒకడుగా వినుతి కెక్కాడు.

అరణ్యపర్వశేషంతోపాటు మఱికొన్ని మహాగ్రంథాలను గూడా రచించి తెలుగుజాతికి తఱగని ఆస్తిగా ప్రసాదించి పోయిన యీ మహానుభావుని జీవిత విశేషాలను

గుఱించి తెలుసుకోవడం మన ధర్మం. ఇటువంటి మహా వ్యక్తుల జీవితాలు మన కుత్సాహాన్ని కల్పిస్తూ, మార్గదర్శకా లవుతుంటాయి.

ఎఱ్ఱాప్రెగ్గడ వంశవృక్షం ఈ క్రింది విధంగా ఉంటుంది.




ఎఱ్ఱన తన నృసింహపురాణంలో చేసిన వంశ వర్ణనను బట్టి యీ క్రమం తెలియవస్తుంది. ఎఱ్ఱనది ఆపస్తంబ సూత్రం. శ్రీవత్సగోత్రం. ఆయన నియోగి. ఎఱ్ఱన పూర్వుల నివాసం వేగినాటిలోని కాకరపర్తి అగ్రహారం. దీనినే నృసింహపురాణంలో ఎఱ్ఱన 'కరావర్తి'

అన్నాడని పరిశోధకుల నిర్ణయం. ఎర్రన తండ్రి సూరన, ఉభయభాషలలో గొప్పకవి. ఎర్రయ గురువు శంకరస్వామి.

ప్రెగ్గడ జీవితాన్ని మూడుభాగాలుగా విభజింపవచ్చు. అతడు జన్మించింది మొదలు ప్రోలయవేమారెడ్డి ఆస్థానంలో ప్రవేశించేదాకా ఉన్నకాలం మొదటి భాగం. రాజాస్థానంలో ఉండి గ్రంథరచన చేసిన కాలం రెండవ భాగం. ప్రోలయ వేముని మరణానంతరం సాగిన అతని జీవితం మూడో భాగం.

## 1

ఎర్రన నివాసస్థలం నేటి ప్రకాశం జిల్లాలోని కందుకూరుకు చేరువనున్న గుడ్లూరు. అరణ్యపర్వం చివర ఈ పద్యం కనిపిస్తుంది.

సీ. "భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు
శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుండిలఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వరస్థానమై యెసకయెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణ గరిష్ఠతనొప్పు
ధన్యుఁడు ధర్మైకతత్పరాత్ముఁ

తే. డెట్టనార్యుండు సకలలోకైక విదితుఁ
డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజనహర్ష సిద్ధిఁగోరి."

దీన్ని బట్టి ఆయన నివాసస్థలం గుడ్లూరని తెలుస్తున్నది. బహుశః అది ఆయన జన్మస్థలం కూడా కావచ్చు. క్రీ.శ. 1580 ప్రాంతాల ఉన్న చదలవాడ మల్లన యెర్రన వంశంవాడు.

"ఇతడు విప్రనారాయణ చరిత" అనే ప్రబంధం వ్రాశాడు. దానిలోని "ప్రతిభతో నారణ్య పర్వశేషముఁ జెప్పెఁగవులకుఁ జెవుల పండువులు గాఁగ" అనే పద్యాన్ని బట్టి యెఱ్ఱన యింటి పేరు కూడా చదలువాడ కావచ్చునేమో అనిపిస్తుంది. కాని, ఎఱ్ఱన తన జీవిత చరమ దశలో చదలువాడలో స్థిరపడి ఉండవచ్చుననీ, అందుచేతనే ఆయన వంశం వాడైన మల్లన కాపేరు కలిగి ఉండవచ్చుననీ చెప్పడానికి కూడా అవకాశం ఉన్నది.

ఎర్రనను ఆదరించిన ప్రోలయవేమారెడ్డి, అనపోతారెడ్ల కాలాన్నిబట్టీ, ఎర్రన కృతి రచనా క్రమాన్నిబట్టీ, ఎర్రన వంశంతో సంబంధం గల వెలనాటి చోడుల కాలాన్నిబట్టీ, ఎర్రాప్రెగడ క్రీ.శ. 1280లో జన్మించి క్రీ.శ. 1364 దాకా

జీవించి ఉంటాడని చెప్పవచ్చు. 1324-25 లలో రెడ్డి రాజ్యాన్ని స్థాపించిన ప్రోలయవేముని ఆస్థానంలో ఎఱ్ఱన ఉన్నందువల్ల, అప్పటి కతఁడు 45 ఏండ్లు గల ప్రౌఢకవి అయి ఉండవచ్చు. దాన్నిబట్టే ముఖ్యంగా అతడు క్రీ.శ. 1280 ప్రాంతంలో పుట్టాడని చెప్పడం. కాకతీయ సామ్రాజ్యం క్రీ.శ. 1323లో పతనమయింది. అప్పుడు కాకతీయ సేనానులైన 75 మందిలో ఒకడైన పంట దేసటి కులస్థుడైన ప్రోలయవేమారెడ్డి తెలుగుదేశాన్ని ఆక్రమించుకొన్న మహమ్మదీయులను తన భుజబలంతో తఱిమికొట్టి కందుకూరు మొదలు గోదావరీ తీరం వఱకూ తన రాజ్యాన్ని స్థాపించాడు. ఇది క్రీ.శ. 1324-25లలో జరిగింది. ఆ రాజ్యానికి ఆదిలో అద్దంకి రాజధాని. ఆ రాజ్య ప్రారంభ కాలంలోనే ప్రోలయవేమారెడ్డి చిన్న తమ్ముడైన మల్లారెడ్డి ఎఱ్ఱాప్రెగ్గడను చేరదీసి, ఆయన్ని రాజయిన ప్రోలయవేమునికి అప్పజెప్పాడు. ఆ విధంగా ఎఱ్ఱాప్రెగ్గడ ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి అయ్యాడు. అంత వఱకూ ఎఱ్ఱాప్రెగ్గడ జీవితం ఎలా సాగిందో, ఏమేమి రచనలు చేశాడో మనకు తెలియదు. అప్పటికాయన నలభైయేండ్ల వాడనుకొన్నాం గదా! అంత కాలం ఏ కవీ ఏ రచనా చెయ్యకుండా ఉండడు. మఱైతే అప్పటి వఱకూ ఎఱ్ఱాప్రెగడ చేసిన రచన లేమైనాయో మనకు తెలియదు. ఆయన కూడా ఆయనవిగా ఇప్పుడు

మనకు దొరుకుతున్న నాలుగు రచనలు గాక ఇతర రచనలు చేసినట్లు చెప్పకోలేదు. ఒకవేళ అప్పటి వఱకూ చేసిన రచన లంత ప్రశస్తమైనవని ఆయన భావించలేదేమో! మొత్తం మీద ప్రోలయవేమారెడ్డి ఆస్థానంలో ప్రవేశించక ముందు ఆయన చేసిన రచనలేవీ మనకిప్పుడు లభ్యం కావడం లేదు.

## 2

ఎర్రనగారి జీవితంలోని రెండవ భాగం అతడు రాజాస్థాన ప్రవేశం చేసిన తరువాత ప్రారంభమవుతుంది. అదే అతని సాహిత్య జీవితం. తమ్ముడు తన కప్పజెప్పిన కవిని జూచి ప్రోలయవేమారెడ్డి ఒకనాడిలా అన్నట్లు హరి వంశంలో ఉంది.

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు
నిన్నాతత
శ్రీ తోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్టి
మాకిచ్చుటన్
జేతో మోదమెలర్ప రామకథయున్ జెప్పించి,
యత్యుత్తమ
ఖ్యాతింజెందితి నింక నేను దనియన్ గావ్యామృతా
స్వాదనన్" (హ.వం.పూ.భా-1-39)

ఈ పద్యాన్ని బట్టి మనకు తెలియవచ్చే మొదటి విషయమేమంటే, యెఱ్ఱాప్రెగడ ప్రోలయవేముని ఆస్థానంలో ప్రవేశించడానికి మునుపే అతణ్ణి మల్లారెడ్డి చేరదీశాడు. తీసి, ఆయన్నెంతో సంపన్నుణ్ణి చేసిన తరువాతనే అన్న అయిన ప్రోలయవేమునికి అప్పగించాడు.

ఆ విధంగా ఎఱ్ఱన తన ఆస్థానకవి అయిన తరువాత ప్రోలయవేముడు కోరి యెఱ్ఱనచేత రామాయణ రచన చేయించాడు. దానివల్ల వేముడి కెంతో ఖ్యాతి కలిగింది. కానీ, కావ్యామృతాన్ని ఆస్వాదించడంలో అతనికింకా తృప్తి తీఱ లేదు కాబట్టి మళ్ళీ యెఱ్ఱాప్రెగడ నుద్దేశించి ఒకనాడిలా అన్నాడు.

"భారతపరాంశయని యిం, పారఁగఁ జెప్పుదురు బుధులు
హరివంశమునీ, వారయ్యకథ తెలుంగుగ, ధీరోత్తమ
నిర్వహించి తెలుపుము మాకున్"

(హ.వం.పూ.భా - 1 - 40)

హరివంశాన్ని తెనిగించవలసిందని ఎఱ్ఱాప్రెగడను కోరడంలో ప్రోలయవేముని ఉద్దేశం ఏమిటో దీన్నిబట్టి తెలుస్తోంది. అందుకు కారణం హరివంశం భారత పరాంశం కావడమే. అంటే భారతంలో పర భాగం. ఇది భారతానికి

ఖిలమని కూడా అంటారు. ఖిలమంటే అనుబంధ రచన. శేషరచన. అందుచేత ఇది ఖిలపురాణం. సంస్కృతంలో రామాయణ భారతాలు ప్రసిద్ధాలు. వాటిలో అప్పటికే ప్రోలయవేముడు తనకంకితంగా ఎఱ్ఱాప్రెగడచేత రామాయణం వ్రాయించుకొన్నాడు. పోతే భారతానికి అనుబంధ రచనయైన హరివంశం అప్పటికి తెలుగులోకి రాలేదు. సంస్కృతంలో హరివంశం శతపర్వ సంభృతమని ప్రసిద్ధి. సంస్కృతంలో మహాభారతమంటే హరివంశంలో కలిసిందే. కాని, "హరివంశాన్ని కూడా మహాభారతంతో చేరిస్తే, అందులోని హరివంశపర్వం, విష్ణుపర్వం, భవిష్యపర్వం కలిసి వందపర్వాలకంటే మఱి మూడుపర్వాలు అధికమవుతాయి" అని కూడా ఒక అభిప్రాయం.

హరివంశంలో వృష్ణ్యంధక వంశాలు వర్ణింపబడ్డవి. భారత కథా సూత్రధారియైన శ్రీకృష్ణుని చరిత్ర సమగ్రంగా అందులోనే ఉంది. అందుచేతనే సంస్కృతంలో మహాభారతమంటే హరివంశ సహితమైనదే. తెలుగులో కూడా మహాభారతం ఆ విధమైన సమగ్రతను సంపాదించుకోవాలంటే హరివంశం తెలుగులోకి రావాలి. అందుచేతనే ప్రోలయవేముడు ఎఱ్ఱాప్రెగడను ఆ కోరిక - అంటే, హరివంశాన్ని తెనిగించుమని కోరాడు. అందువల్ల కావ్యామృతాస్వాదనంలో ఆయనకు తృప్తికల్గడం ఒకటి, మహాభారతం

సంస్కృతంలో వలె తెలుగులోను సమగ్రం కావడానికి తాను కారణభూతుడు కావడమనేది ఒకటీ ఆయనకు సిద్ధించే ప్రయోజనాలు. ఎఱ్ఱాప్రెగడ కూడ వేముని కోరికను మన్నించి హరివంశాన్ని ఆంధ్రీకరించి తన ప్రభువైన ప్రోలయవేమా రెడ్డికే అంకితమిచ్చాడు.

దీన్ని బట్టి యెఱ్ఱాప్రెగడ ప్రోలయ వేముని ఆస్థానంలో ప్రవేశించిన తరువాత వేముని కోరిక మీద మొదట రామాయణాన్నీ, తరువాత హరివంశాన్నీ రచించి, ఆ రెంటినీ ఆయనకే అంకితమిచ్చాడని తెలుస్తున్నది. ఇందుకు హరివంశంలోనిదిగా ఇదివఱకే ఉదాహరింపబడిన "నా తమ్ముండు" - ఇత్యాదిగా గల పద్యం ఆధారం. ఎఱ్ఱన యీ రెండు రచనలూ పూర్తయేసరికి ప్రోలయ వేమారెడ్డి రాజ్య కాలం ముగిసిపోయింది. అంటే క్రీ.శ. 1353 లో ప్రోలయ వేముడు మరణించాడు. హరివంశ రచన తరువాత ప్రోలయ వేముడు తన కంకితంగా మఱేదైనా కృతిని రచింపుమని యెఱ్ఱాప్రెగడను కోరినట్లు కనిపించదు. అందుచేతనే యెఱ్ఱన హరివంశం తరువాత చేసిన రెండు రచనల - అంటే అరణ్యపర్వశేష, నృసింహ పురాణాలలో మొదటి దానిని రాజరాజనరేంద్రునికీ, రెండవ దాన్ని తన యిష్టదైవమైన అహోబల నృసింహ స్వామికీ అంకితం చేశాడు.

ప్రోలయ వేముడు హరివంశాన్ని ఆంధ్రీకరించుమని యెర్రాప్రెగ్గడను కోరడంలో తెలుగులో హరివంశ సహితంగా భారతం సమగ్రంగా అవతరించాలన్నదే ప్రధానాశయం. అది చాలా ఉదారమైన ఆశయం కాబట్టే యెర్రన కూడా ఒప్పుకొని హరివంశాన్ని ఆంధ్రీకరించాడు. కాని, ఆ పని చేసిన తరువాత కూడా మహాభారతం తెలుగులోకి పూర్తిగా రాకపోవడం ఎర్రాప్రెగడ గమనించాడు. అప్పటికింకా అరణ్యపర్వశేషం తెలుగులోకి రాకపోవడమే అందులకు కారణం. అది గూడా తెలుగు చేయబడితేనే గాని తెలుగు భారతం సమగ్ర స్వరూపాన్ని పొందదు. మరి తెలుగులో మహాభారతానికి సమగ్రత తనవల్ల సిద్ధించాలన్నదే తన ప్రభువు ఆశయమైతే, తాను అరణ్యపర్వశేషాన్ని కూడా ఆంధ్రీకరించక తప్పదు. మరైతే దాన్నికూడా ఆంధ్రీకరించమని ప్రభువెందుకు కోరలేదు ? తన కంకితంగా వ్రాయుమనడానికైతే చెప్పగలడుగాని, అరణ్యపర్వశేషాన్ని ఆంధ్రీకరించి తన కంకితమిమ్మని చెప్పలేడు గదా ? అలాగని దాన్ని ఆంధ్రీకరించి నిష్కామకర్మగా రాజరాజ నరేంద్రుని కంకితమిమ్మని చెప్పడమూ కుదరదు. అది కవి మనఃపరిణతికీ, వ్యక్తిత్వానికీ సంబంధించిన విషయం. అందుచేత అరణ్యపర్వశేషాన్ని రాజరాజనరేంద్రుని కంకితంగా ఆంధ్రీకరించడానికి ఎర్రన తనకు తానై నిర్ణయించుకొని ఉంటాడు. అందుకు

ప్రభువు కూడా హర్షించి ఉండవచ్చు. అతని యెఱుకతోనే అరణ్యపర్వశేష రచన సాగి ఉండవచ్చుననే విషయం తరువాత తద్రచనా కాలాన్ని గుఱించి తెలిపేటప్పుడు విశదం కాగలదు.

ఆ విధంగా ఆరణ్యపర్వశేషాన్ని కూడా ఆంధ్రీకరించడంతో తెలుగులో మహాభారత సమగ్రతను సాధించిన గౌరవం ఎఱ్ఱనకు దక్కింది. దానితో ఆయన ధర్మార్థ కామ పురుషార్థసాధన పూర్తయింది. పోతే మిగిలింది పుణ్యం. మోక్షపురుషార్థసాధన. అందుకోసమే లక్ష్మీనృసింహావతార కథను వ్రాసి తన యిష్టదైవానికి అంకితం ఇచ్చుకున్నాడు.

అరణ్యపర్వశేషం తరువాతనే నృసింహ పురాణం వ్రాసినట్లు నృసింహ పురాణంలోని యీ క్రింది పద్యంవల్ల తెలుస్తున్నది.

ఉన్నత సంస్కృతాంధ్ర చతురోక్తి పథంబులఁ
గావ్యకర్తవై
యెన్నికయై ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ యాంధ్రభాష సుజనోత్సవ మొప్పగ
నిర్వహించితౌ
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి
పెంపునన్.
(నృ. పు. పీఠి-17)

మీద వివరించిన దాన్ని బట్టి హరివంశంలో రామాయణ ప్రసక్తి ఉంది కాబట్టీ, నృసింహ పురాణంలో అరణ్యపర్వశేష ప్రసక్తి ఉంది గాబట్టీ, రామాయణ హరివంశాలొక జంటగా, అరణ్యపర్వశేష నృసింహ పురాణాలొక జంటగా మనం పరిగణించవలసి ఉంటుంది. ఈ జంటల నీ విధంగా పరిగణించడంలో పేచీ లేదు. కానీ, ఇందులో ఏ జంట ముందు? అనే జిజ్ఞాస పండితలోకంలో రేకెత్తి అనేక వాదోపవాదాలకు దారితీసింది. కొందఱు రామాయణ హరివంశాల జంటే ముందంటే, మఱి కొందఱు కాదు, అరణ్యపర్వశేష నృసింహ పురాణాల జంటే ముందన్నారు. ఈ విషయంలో సహేతుకమైన నిర్ణయం చేయవలసి ఉంది.

మీద పేర్కొన్న రెండు జంటల్లో అరణ్యపర్వశేష నృసింహ పురాణాలే మొదటి జంట అంటే వాటిని ఎఱ్ఱాప్రెగడ ప్రోలయవేముని ఆస్థానంలో ప్రవేశించక మునుపే, అంటే క్రీ.శ. 1325కు మునుపే వ్రాసి ఉండాలి. అలా కాకుండా క్రీ.శ. 1325 లో ప్రోలయవేముని ఆస్థానంలో ప్రవేశించి, అరణ్యపర్వశేష, నృసింహ పురాణాలు వ్రాసి రాజరాజ నరేంద్రుడికీ, నృసింహ స్వామికీ అంకిత మిచ్చుకునే దాకా ఊరుకుని, ఆ తరువాత వేముడు రామాయణ హరివంశాలను తన కంకితంగా చెప్పించుకొన్నాడని చెప్పవలసి

వస్తుంది. అది సబబు కాదు. కాబట్టే వాటి రచన క్రీ.శ. 1325 కు మునుపే పూర్తి చేశాడని చెప్పవలసి వస్తుందనడం. మఱి అలా చెప్పడం సాధ్యమేనా? ఎఱ్ఱాప్రెగడ క్రీ.శ. 1280 ప్రాంతంలో పుట్టాడని ముందే నిరూపింపబడింది. అంటే క్రీ.శ. 1325లో ప్రోలయవేముని ఆస్థానంలో ప్రవేశించేటప్పటి కాయనకు 45 సంవత్సరా లుండి ఉండాలి. ఆ వయసుకా పుస్తకాలు వ్రాస్తే వ్రాయవచ్చు గానీ, అవి వ్రాసిన తరువాత రామాయణ హరివంశాలు వ్రాశాడనడం మాత్రం కవితాతత్త్వం తెలిసిన వ్యక్తులు చెప్పదగిన మాట కాదు. ఎఱ్ఱన గ్రంథాలను క్షుణ్ణంగా పరిశీలించిన వారెవ్వరూ ఆ క్రమాన్ని అంగీకరించరు.



ఈ నాలుగు గ్రంథాలలోని యెఱ్ఱనగారి శైలినీ, వర్ణనాత్మకతనూ, పాత్రచిత్రణ రసపరిపోషణాది లక్షణాలనూ, ఆయన వ్యక్తిత్వంలో కలిగిన క్రమ పరిణామాన్నీ జాగ్రత్తగా గమనిస్తే, రామాయణ హరివంశ, అరణ్యపర్వ శేష నృసింహ పురాణాలనే క్రమమే సమంజస మైనదిగా కనిపిస్తుంది. తొలుత ఐహిక భోగాలను ఆశించడమూ, ఆ పిదప ఆముష్మిక ఫలప్రాప్తికై ప్రయత్నించడమూ న్యాయం గాని, తొలుత ఆముష్మికం మీదా, తరువాత ఐహికం మీదా శ్రద్ధ చూపడం మానవ లక్షణం కాదనీ, అందుచేత, ఐహిక

భోగాల నాశించి రాజు కంకితమిచ్చిన రామాయణ హరి వంశాల కంటె ముందే ఆముష్మిక ఫల ప్రాప్తికోసమై ఎఱ్ఱన అరణ్యపర్వశేష, నృసింహ పురాణాలను రచించాడ నడం సబబు కాదని కూడా చాలమంది పండితుల తలంపు. ఇదిలా ఉండగా భాషా విషయకమైన ఆధారాలను పురస్కరించుకొని యెఱ్ఱనగారి నాలుగు గ్రంథాలనూ పరిశీలిస్తే రామాయణ హరివంశ, అరణ్యపర్వ శేష నృసింహ పురాణాలనే క్రమమే సరైనదని స్పష్టంగా తేలిపోయింది.[1] కాబట్టి, యీ విషయమై యింక సందేహం ఉండనక్కఱలేదు.

పోతే, యీ నాలుగు గ్రంథాలూ ఏయే కాలాల్లో రచింపబడి ఉండవచ్చు? అనే ప్రశ్న మిగులుతుంది.

ప్రోలయవేముని ఆస్థానంలో ప్రవేశించి, అతని కోరిక మేర కెఱ్ఱన సంతరించిన రామాయణ హరివంశాలు రెండూ చాలా పెద్దవి. అందుచేత క్రీ.శ. 1325-1335 ల నడుమ రామాయణాన్నీ, క్రీ. శ. 1335-1343ల నడుమ హరివంశాన్నీ యెఱ్ఱన రచించి ఉండవచ్చునని చెప్ప వచ్చును. అమరేశ్వరాలయ శాసనం, ముట్లూరి శాసనం,

1. చూడు - "A critical Study of Errapraggada's works", un published Ph. D. Thesis. S. V. University - 1964 V Ramachandra.

మఱికొన్ని యితరాధారాలను పురస్కరించుకొని యీ నిర్ణయం చేయబడింది. 1343 తరువాత ఒకటి రెండు సంవత్సరాలు వ్యవధి యిచ్చినా, క్రీ.శ. 1346-1353 ల నడుమ అరణ్యపర్వ శేష నృసింహ పురాణాల రచనసాగి ఉండాలి. లేదా తుది రెండు రచనలూ క్రీ.శ. 1360 లోపల పూర్తి చేయబడి ఉండవచ్చునని కూడా చెప్పవచ్చు. అంటే యీ రెండు రచనలు కూడా ప్రోలయవేముని రాజ్య కాలంలోగాని, లేదా క్రీ.శ. 1353 లో ఆయన మరణించిన తరువాతగానీ పూర్తి చేయబడి ఉండవచ్చునని చెప్పవచ్చు.

ఈ మహాకవికి రెండు బిరుదులున్నాయి. శంభుదాసుఁడూ, ప్రబంధపరమేశ్వరుఁడు - అనేవి అవి. మొదటిది అతని మత ప్రతిపత్తిని తెలిపితే, రెండవ దతని సాహిత్య ప్రతిపత్తిని తెలుపుతుంది. తమ తాతగారైన యెరపోతసూరి కలలో కనిపించి తమతో ఇలా అన్నారని యెర్రనగారు తమ నృసింహ పురాణంలో వ్రాసుకొన్నారు.

"గిరిశ పద భక్తిరస త
త్పర భావము కలిమి శంభుదాసుండనఁ గాఁ
బరగియు గోవింద గుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడవెందున్"

(నృ.పు. పీఠి - 18.)

'శంభుదాసుఁడు' అనే ప్రసిద్ధి పొందినప్పటికీ, ఆయనకు విష్ణు కథలంటే అమిత ప్రీతి. ఆయన బిరుదం మాత్రమే శంభుదాసుడు. గ్రహించినవన్నీ విష్ణుకథలే. అంటే ఆయన తన జీవితంలోనూ, రచనల్లోనూ కూడా హరిహరా ద్వైతాన్ని పాటించా డన్నమాట. ప్రబంధ పరమేశ్వరుఁడనే ప్రశస్తి ఆయనకు అరణ్యపర్వ శేష రచనవల్ల కలిగి, తరువాత అది బిరుదంగా కొనసాగిందని నృసింహ పురాణం లోని క్రింది పద్యం వల్ల తెలుస్తుంది.

"ఉన్నత సంస్కృతాంధ్ర చతురోక్తి పథంబులఁ
గావ్యకర్తవై
యెన్నికయై ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ
నిర్వహించితౌ."
(నృ. పు. పీఠి - 17)

ఎఱ్ఱనకు ప్రబంధపరమేశ్వరుఁడనే ప్రశస్తి కలగడాని కితర కారణాలు కూడా ఉన్నా, విశిష్టమైన ఆతని వర్ణనాత్మక శైలే అందుకు ముఖ్య కారణం. అతడు పురాణ కవుల కోవకు చెందిన వాడైనా, అద్భుతమైన తన వర్ణనాత్మక ధోరణిలో తరువాతి ప్రబంధ కవులకు మార్గదర్శకుడైన మహాకవి. ఆయన నృసింహ పురాణం, పేరుకే పురాణం.

నిజాని కిదొక ఉత్తమ ప్రబంధం. రామాయణ, హరివంశ, భారతారణ్యపర్వ శేషాలు కూడా ప్రబంధత్వాన్ని సంతరించు కొన్న కృతులే. ఇంతటి మహాకవి అయినా ఆయన "వినయో దయభరితుఁడు".

**రామాయణం :**

ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణం వ్రాశాడని మనకు తెలుసు కానీ, దురదృష్టమేమంటే, అది మనకీనాడు దొరకడం లేదు. అందుచేత, ఆ రామాయణం ఎలాంటి రచన, ఎంతటి రచన - అనే జిజ్ఞాస పండితలోకంలో తలెత్తింది. ఎఱ్ఱన వంశంవాడైన చదలువాడ మల్లన, యెఱ్ఱనగారి రచనలను గురించి వ్రాస్తూ, "వల్మీక భవు వచో వైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబుఁ జేసె" అని అన్నాడు. అంటే ఎఱ్ఱప్రెగ్గడ రామాయణం వాల్మీకి రామాయణాని కాంధ్రీకరణ మేననీ, వాల్మీకి రామాయణం వలె అది కూడా ఉద్గ్రంథమే అనీ, అది ప్రబంధ ధోరణిలో రూపొందిన రచన అనీ, మనకు చదలువాడ మల్లన వాక్యాలను బట్టి విశదమవు తుంది. మఱి యిటువంటి ఉత్తమ రచన యెందుకు నశించి పోయిందో తెలియదు. ఒకవేళ యెక్కడైనా ఆ రామాయణం అజ్ఞాతంగా ఉన్నదేమో కూడా తెలియదు. ఇది యిలా ఉండగా, హుళక్కి భాస్కరాదులు వ్రాసి, సాహిణి మారన

కంకిత మిచ్చిన కాకతీయ ప్రతాపరుద్రుని నాటి భాస్కర రామాయణంలోని అయోధ్య, అరణ్యకాండలలోని కొన్ని ఘట్టాలలో పాఠాంతరాలుగా చాలా పద్యాలు కనిపిస్తున్నాయి. ఈ పాఠాంతరాలుగా కనిపించే పద్యాలన్నీ (మూల గ్రంథం లోనివో, అధస్సూచికలోనివో) యెర్రాప్రెగ్గడవే కావచ్చునని పండితుల ఊహ. అది నిజమే కావచ్చు. పోతే కొందఱు లాక్షణికు లుదాహరించిన వాటినీ, తాళపత్ర సంపుటాదుల్లో లభిస్తున్న వాటినీ మొత్తం 46 పద్యాల నెంతో శ్రమపడి సేకరించి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'భారతి' పత్రిక లోనూ, రెడ్డి సంచికలోనూ "ఎర్రాప్రెగ్గడ రామాయణం" అనే శీర్షికలో ప్రకటించియున్నారు. ఆ పద్యాలు రామాయణ మంతా విస్తరించి ఉండడం వల్ల మల్లన చెప్పినట్లు అది వాల్మీకి రామాయణం వలె విపులమైన రచన (బాల రామా యణంతో సహా) అని తెలుస్తున్నది. ఈ పద్యాలలో కూడా ఆ రామాయణ ప్రబంధత్వాన్ని స్థాపించే వర్ణనాత్మకాలైన యెన్నో పద్యాలున్నాయి. ఆయా ఘట్టాలకు సంబంధించి స్థాలీపులాకంగా మాత్రమే లభిస్తున్న యీ పద్యాలు పరిపక్వ మైన ఆయన కవితా ధారకూ, ఆయన శిల్పపారంగతకూ పతాకల్లాగా ఉన్నవి. ఆ పద్యాల్లో కొన్నింటి నిక్కడ ఉదాహ రించడం సముచితంగా ఉంటుంది.

సారోదార సమంచిత స్ఫురదురు స్ఫాయల్ల సల్లాలిత
(స్ఫారంబుల్) వెసఁ ద్రిప్పిపెట్టు చును శబ్ద ద్రవ్య
హీనుల్ సదా
తారుం జెప్పితి మంచుఁ జెప్పికొనుటల్ తప్పే
నిరాఘాట వా
క్సౌరభ్య ప్రతిభా విజృంభితులు మెచ్చన్ గాక
యానాదముల్,
(ఒక ప్రాచీన పద్య సంకలనం)

ఇది రామాయణావతారికలోని కుకవి నిందకు సంబంధించిన పద్యం కావచ్చును. తన యిష్టదైవాన్ని స్తుతిస్తూ కృత్యాదిలో చెప్పిన పద్యం కావచ్చు నీ క్రిందిది.

నిను సేవించినఁగల్గు మానవులకున్ వీటీ వధూటీ ఘటీ
ఘన కోటీ శకటీ కటీ తటి పటీ గంధీ భవాటీ పటీ
రనటీ హారిపటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికా పేటికల్
కనదామ్నాయ మహాతురంగ శివలింగా నీలకంఠేశ్వరా!
అయోధ్యకాండ నుండి యీ క్రింది పద్యం.

"సందడి యధ్వర క్రియక సంగతమేని బలంబు
తోడఁబెన్
గ్రందడియేల యేన తగఁ గార్ముక హస్తుఁడనై
కడంగి మీ

ముందఱ నిల్చెదన్ గ్రతువు ముట్టక యుండఁ
ప్రచండదైత్యగా
జిందగదవ్వదౌల వెసఁ జించెదఁ బెందెదమీకు
మోదమున్.

శ్రీ డా॥ నేలటూరు వేంకట రమణయ్యగారు కనుగొన్న అరణ్యకాండలోని పద్యం యీ క్రిందిది.

"ఆ నెఱజోదు కేలుదొనకై నిగుడించుట యమ్ము
మౌర్వీసం
ధానము సేత నిండఁదెగ దార్చ్కని లక్ష్యము సేయు
డేయుడున్
గాన నజస్ర మండలిత కార్ముక మొక్కటి గంటిఁ
గంటి న
ద్దానవ వీర దేహ సముదాయ నిరంతర పాత
వేగముల్."

ఈ క్రిందిది కిష్కింధాకాండలోని పద్యం. హనుమ అబ్ధినిదాటిన విధానాన్ని తెలుపుతుంది.

చువ్వన మేను వంచి రవి సోకఁగఁదోఁక విదల్చి
పాదముల్
వివ్వఁగ బట్టి బాహువులు వీచి మొగంబు బిగించి
కొండ జౌ

జవ్వన నూగి ముందటికి జాగి పిఱిందికిఁ దూగి వార్థిపై
జివ్వన దాటె వాయుజుఁడు ఱెక్కలతోడి సురాద్రి
యోయనన్.

ఇక యుద్ధకాండ నుండి రెండు పద్యాలు.

"ఆతని రౌద్ర రేఖఁగని యబ్ధి గలంగెఁ జలించె శైల మౌ
త్పాతిక వారిదంబు లతి దారుణ రావములై జనించె ధా
త్రీతల మెల్ల బిట్టదరె, దిక్కులు వ్రీలె, సమస్త
భూతముల్
భీతి వహించె డెందమగలెన్, రజనీచరలోక
భర్తకున్."

ఈ పద్యంలో రావణుని పట్ల రామునికి కలిగిన కోపం వర్ణింపబడింది.

**మరొకటి :**

"త్రెవ్వెడు గంటులన్ గురువు దేఱెడు నెత్తురు
రాకమున్న యే
నొవ్వియు నే వికారము మనోగతి (జెందక యున్న
సాయకం
బవ్వలఁబోకయున్న మకుటాట్ట విఘట్టన రావ
మొప్పఁగా
నువ్వన నువ్వతిల్లె నసురోద్వహు మూర్ధచయంబు
గ్రక్కునన్."

రాముడయోధ్యకు వెళ్ళటాన్ని తెలిపే పద్యం క్రిందిది.

"రావణుఁ గూల్చి క్రమ్మఱ ధరాసుతఁ జేకొని
వచ్చు చున్నవాఁ
డా వసుధా కళత్రుఁ డిదె యాప్తులతోడ మహేం
ద్రుతో శచీ
దేవియుఁ బోలె సీత జగతీతల నాథునిఁ గూడి
సంతత
శ్రీ విలసిల్ల నున్నయది చేరిన వాఁడు సుమిత్ర
పట్టియున్."

మల్లన చెప్పినట్లు ఎఱ్ఱన "వల్మీక భవు వచో వైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబు. జేసె" అనడానికి ఉదాహరింపబడిన పద్యాలు నిదర్శనాలు. ఈ పద్యాలను బట్టి ఎఱ్ఱాప్రెగడ కవితా ప్రజ్ఞ సైతం విజ్ఞులకు విశదం కాగలదు.

ఎఱ్ఱన రెండవ రచన హరివంశం. ఇది, యింతకు ముందే చెప్పబడినట్లుగా ఖిల పురాణం. ఏత దాంధ్రీకరణ విషయమై ఎఱ్ఱన వేమునితో ఇలా అంటాఁడు.

"నన్నయ భట్ట తిక్క కవినాథులు చూపిన త్రోవ
పావనం
బెన్నఁ బరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయ
మాదిదేవుఁడౌ

వెన్నుని వృత్త మీవు కడు వేడుకతో వినునాయ
కుండ వి
ట్లెన్నియొ సంఘటించె మదభీప్సిత సిద్ధికిరాజ
పుంగవా !"
(హ. వం. 1-42)

సంస్కృతంలో హరివంశం హరివంశ, విష్ణు,భవిష్య పర్వాలుగా విభజింపబడి ఉన్నది.ఎర్రాప్రెగ్గడ మాత్రం దాన్ని పూర్వోత్తర భాగాలుగా విభజించాడు. శ్రీకష్ణుడు బాల్యం దాటి వ్రేపల్లె వదలి మధురలో స్థిరపడే దాకా ఉన్న అతని జీవితం మొదటి భాగం. అక్కడ నుండి అతని రాజకీయ జీవితంతో, శృంగారాది గాథలతో తుది దాకా నడచిన అతని జీవితం రెండో భాగం. సంస్కృత హరివంశ ప్రతులు కొన్నింటిలో పర్వవిభాగంతో పాటు పూర్వోత్తర విభాగం కూడా కనిపిస్తుంది. కాని, ఎర్రాప్రెగ్గడ పూర్వోత్తర విభాగం మాత్రమే చేశాడు. బహుశః ఆయనకాలపు సంస్కృత ప్రతులలో అటువంటి విభాగమే ఉండి ఉంటుంది. హరివంశా దిలో ఎర్రాప్రెగడ నన్నయ తిక్కనలను గుఱించీ, తన గురువును గుఱించీ యిలా ప్రశంసించాడు.

"ఉన్నతగోత్ర సంభవము నూర్జిత సత్వము భద్ర
జాతి సం
పన్నమునుద్ధతాన్య పరిభావి మదోత్కట మున్న
రేంద్ర పూ

జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్ట
కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతినెందును గ్రాలుట ప్రస్తు
తించెదన్.

తనకావించిన సృష్టి తక్కొరుల చేతంగాదు నానే
ముఖం
బున దాఁ బల్కిన పల్కులాగమము లై పొల్పొందు
నావాణి భ
ర్తను నీతం డొక రుండ నాఁ జనుమహత్త్వాప్తిన్
గవిబ్రహ్మనా
వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలోర్వీ దేవతాభ్య
ర్చితున్.

కామ విలోభకస్పృహల గర్వపరంపర క్రందు
వ్రాసి, హృ
త్తామరసస్థితుండగు సదాశివుఁగాంచి తదేకచింత చిం
తామణి యైతలిర్పఁదుది దాఁకిన యున్నతిఁ గన్న
శంకర
స్వామి గురుండు మాతలఁపు సర్వముఁగా నయి
యాతఁడుఁ గావుతన్."
(హ. వం. 1, 8-10.)

ఎఱ్ఱన హరివంశాన్ని దాని సంస్కృత మూలంతో పోల్చి చూచినప్పుడు మూలకథా ప్రాశస్త్యం చెడకుండా దాన్ని సంగ్రహించి వ్రాయడంలోనూ, అందులోని కథలను ఔచిత్య శుద్ధంగా, క్రమబద్ధంగా కూర్చుకోవడంలోనూ అతడు ప్రదర్శించిన నేర్పు అతని శేముషీ వైభవాన్ని వేనోళ్ళ చాటుతుంది. వేలకొలది శ్లోకాల నాయన సంగ్రహించాడు. కొన్నింటిని పూర్తిగా వదలిపెట్టేశాడు. అంతేగాక ప్రతి సన్నివేశంలోనూ ఆయన స్వతంత్ర భావాలు ఎన్నో చోటు చేసుకొన్నాయి.

క్రీ.శ. 1860 లో పురాణం హయగ్రీవశాస్త్రి గారు పరిష్కరించి ప్రకటించిన సంస్కృత హరివంశానికి మూలమైన ప్రతినే 14 వ శతాబ్దంలో ఎఱ్ఱాప్రెగడ తన రచనకు ఆధారంగా గ్రహించి ఉండవచ్చు. తెలుగు హరివంశంలోని కథల క్రమం హయగ్రీవశాస్త్రి గారు పరిష్కరించి ప్రకటించిన సంస్కృత హరివంశప్రతి లోని కథల క్రమంతో మాత్రమే సరిపడుతుండడం అందుకు కారణం.

సంస్కృత హరివంశం బృహద్రచన. దానికి యథాతథమైన ఆంధ్రీకరణం కాకపోయినప్పటికీ, తెలుగు హరివంశం కూడా బృహద్రచనే. తెలుగులోని ప్రతి పద్యానికీ

సంస్కృతంలోని ప్రతి శ్లోకంతోనూ కొంత భేదం, కొంత సాదృశ్యం కనిపిస్తూనే ఉంటుంది. ఔచిత్య భరితమైన ఒక విశిష్టమైన ప్రబంధంగా తన హరివంశాన్ని రూపొందించడం కోసం అనేక సందర్భాల్లో ఆయన కొన్ని పద్యాలు స్వతంత్రంగా వ్రాయడం, కొన్ని వర్ణనలు చేయడం, కొన్ని మూల భావాలను ప్రపంచించడం, కొన్ని సంఘటనలను సంగ్రహించడం చేశాడు. అవకాశం కలిగి నప్పుడల్లా పాత్రల స్వరూపాన్నీ వాటి మనస్తత్వాలనూ, పరిసర ప్రకృతి శోభనూ, కథాస్థలాన్నీ, పాత్రల వర్తనాన్నీ సమగ్రంగా వర్ణిస్తూ, ఆ వర్ణన ద్వారా కథ కొనసాగేటట్లు చేయడం ఆయనకు గల స్వాభావికమైన ప్రజ్ఞ. తన ప్రబంధాన్ని నిర్దుష్టంగా తీర్చి దిద్దడం కోసం అవసరమైనప్పుడు పలు సంఘటనలను వదిలి పెట్టడం, మఱెన్నో సంఘటనలను క్రమబద్ధంగా కూర్చుకోవడం చేశాడు. ఎర్రన హరివంశంలోని వామదేవ భరద్వాజులకు సంబంధించిన ఉపాఖ్యానం సంస్కృత మూలంలో లేదు. ఎర్రన నాటి సంస్కృత మూలంలో అది ఉండి ఉండాలి. ఇవిగాక నే నింతకు మునుపే చెప్పినట్లు ఎర్రన చేసిన పూర్వోత్తర హరివంశ విభాగం శ్రీకృష్ణుని జీవితాన్ననుసరించి అర్థవంతమై ఉంటుంది. స్వతంత్ర రచన చెయ్యడం కంటె .భాషాంతరీకరణం చాలా కష్టమైన పని

అందునా, కవిత్వ విషయంలో అది మరీ కష్టతరం. అటు వంటిది హరి వంశం లాంటి బృహద్గ్రంథాన్ని దాని సొగసు చెడకుండా ఒక మహాప్రబంధంగా తెలుగులోకి తేవడం, తెలుగు ప్రజల మెప్పు పొందగలగడం ఎర్రనార్యుని అపార శేముషీ వైభవానికి నిదర్శనం కాగలదు.

హరివంశాన్ని తెలుగులో ఎర్రనకు సమకాలికుడైన నాచన సోమనాథుడు కూడా వ్రాశాడు. కానీ హరివంశంలో ఉత్తర భాగంలో ఉన్న కృష్ణునికి సంబంధించిన రమణీయ గాథలను మాత్రమే నాచన సోముడు స్వీకరించాడు. ఎర్రా ప్రెగ్గడ అలా కాకుండా పురాణ లక్షణ లక్షితమైన హరి వంశమంతా ఆంధ్రీకరించాడు. పురాణమైన హరివంశంలో కవిత్వానికి అంతగా అక్కఱకు రాని వస్తువెంతో ఉంటుంది. కాని, తదాంధ్రీకరణకు పూనుకొన్న యెర్రనకు అందులోని ప్రతి విషయాన్నీ ఆంధ్రీకరింపక తప్పదు. అందుచేత ఉషా పరిణయంలాంటి రమణీయమైన కథలను కొన్నింటిని మాత్రమే స్వీకరించి రసోజ్జ్వలమైన శైలిలో నాచన సోముడు వ్రాయగా, తన రచనలోని ప్రతి సంఘటననూ సంయమ ప్రధానమైన చిత్తవృత్తితో తీర్చిదిద్దుతూ, ప్రతి పాత్రనూ స్వభావ సిద్ధంగా రూపొందించాడు ఎర్రన. శ్రీకృష్ణుని శైశవ క్రీడాదులను గుఱించి యెర్రన హరివంశంలో చేసిన

వర్ణన అనేక సందర్భాల్లో బమ్మెర పోతన భాగవతంలోని ఆయా ఘట్టాల రచనకు మార్గదర్శకమవుతూ, పోతన రచన కంటే యెంతో మనోజ్ఞంగా ఉంటుంది. ఉదాహరణకు శ్రీకృష్ణుడు కాళింది హ్రదంలో దూకిన విధానాన్ని తెలిపే యెర్రనగారి యీ క్రింది వర్ణన చూడండి.

ఒడిసికు_గొనఁ జెక్కి_ మడి సంది నునిచిన
తలుగులుఁ దాళ్ళలు దొలఁగవైచి
డాకేల బట్టిన ఢక్క_యుఁ జంకఁదా
ల్చిన వేణువును నన్యు చేతికిచ్చి
పొలుచు ఫించపు దండ వుచ్చి వెండ్రుకల నా
ప్పెడు జడగా నల్లి ముడి యమర్చి
మొలగచ్చ గట్టు పై యలఁగిన పచ్చని
నునుగొంగు దిండుగా నునిచి చుట్టి
చెప్పలూడ్చి కదంబక స్ఫీత తరువుఁ
బ్రాకిఁ పెడ బొబ్బయిడి యార్చి యాఁకగొనక
మడువులోనికి నుఱికె నున్మత్త లీల
నెగసి తత్తోయ కణములు నింగిఁ బొదువ.

(హరి. పూ. భా. 7-13)

ఎర్రన హరివంశంలోని పద్యాల నెన్నింటినో పోతన అనుకరించాడు. బాలకృష్ణుని ఆకారాన్ని ఎర్రన నెరుల

నున్నని కప్పుదుఱుఁగలి గొనఁగూడి, పొదలి వెంట్రుకలు కొప్పునకు నెయిద ఇత్యాదిగా వర్ణిస్తే, "కొప్పున క్రందని కుంతలములు, చెక్కుటద్దములపైఁ జీరువాఱ - ఇత్యాదిగా పోతన వర్ణించాడు. అయితే పోతనకు గల శబ్దాలంకార ప్రీతి ఎఱ్ఱాప్రెగ్గడకు లేదు. అందుచేత ఎఱ్ఱన పద్యాలలో కంటె పోతన పద్యాల్లో గీతీ మాధుర్యం కొంచెం ఎక్కువ ఉండ వచ్చు. కాని, ఎఱ్ఱనగారి పద్యశిల్పం ఒక్కొక్కసారి అనితర సాధ్యంగా అమరి ఉంటుంది. చూడండి

శివుదిక్కు నందు వేకువఁగోల యెఱుఁగులు
మెఱసె నచ్చోన సమీరణుండు
వుట్టి తీవ్రతనేల బెట్టుగాఁ జఱచుచు
విసరె బీఱెండతో నెసఁగె నుమ్మ
యీఁగ మిక్కుట మయ్యె నెఱనింగిఁ గడుమించె
నిడుదలై తిలకించె నీరు కాళ్ళుఁ
బడమట నిరుదెసఁ బ్రతి సూర్యములు దోఁచె
నంబరంబునఁ బర్వె నాగడ పలు
పిన్నబిడ్డ లెయ్యెడలఁ బింపిళ్ళు గూసి
రంఘ్రి తలములు సిమసిమ యనియె జనులు
కఖిల తృణలతా తరుని చయంబుఁ జీడ
వట్టె నిట్టలంబుగ జడిపట్టు పొంటె
(హరి. పూ. భా — ౨ - 160)

జడివాన కురవడానికి ముందు ప్రకృతిలో కలిగే మార్పులను తెలిపేదీ పద్యం. తెలుగు నుడికారపు సొగసుతో ఎంతో రమణీయంగా ఉన్నదీ పద్యం. ఇలాంటి వెన్నయినా చూపవచ్చు. కాని, హరివంశంలోని ఎర్రనగారి కవితా మాధుర్యాన్ని పాఠకులకు చవి చూపించే పని మాత్రం చేసి హరివంశాన్ని గుఱించిన నా వివరణం ఇంతటితో వదలి పెడుతున్నాను.

ఎర్రనగారి మూడవ రచన అరణ్యపర్వశేషం. అరణ్యపర్వంలో మొదటి మూడాశ్వాసాలూ, నాలుగో ఆశ్వాసంలో 142 పద్యాలూ నన్నయగారు వ్రాశారు. నన్నయగారి కడపటి పద్యం ఇది.

> "శారద రాత్రులుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులం
> జారుతరంబులయ్యె వికసన్నవకైరవ గంధ బంధురో
> దార సమీర సౌరభము తాల్చి సుధాంశు వికీర్యమాణక
> ర్పూర పరాగ పాండురుచి పూరములంబర పూరితం
> బులై"

ఇది శరత్కాల వర్ణన. ఎర్రన 143వ పద్యం నుండి ఆ వర్ణనను కొనసాగిస్తూ అరణ్యపర్వశేష రచన చేశాడు. అతని ప్రారంభ పద్యమిది.

"స్ఫురదరుణాంశు రాగరుచిఁబొంపిరి వోయి నిరస్త
నీరదా
వరణములై దళత్కమల వైభవజృంభణ ముల్లసిల్లను
ద్ధుర తర హంస సారస మధువ్రత నిస్వనముల్
సెలంగఁగాఁ
గరము వెలింగె వాసర ముఖంబులు శారద వేళఁ
జూడఁగన్."

నన్నయ రచన శారద రాత్రుల వర్ణనతోనే ముగిసి పోయింది. సూర్యోదయ వర్ణన చేయక ముందే ఆయన అస్తమించడమే అందుకు కారణం కావచ్చు. రాత్రి వర్ణన తోనే ఆయన అస్తమించడం విచిత్రమైన సంఘటన. ఆ పద్య రచన తరువాత కూడా ఆయన బ్రతికి ఉంటే మాత్రం రచన అక్కడకు ఆగిపోయేది కాదు. ఆయన అప్పుడే హఠాత్తుగా మరణించి ఉండవచ్చు. అనారోగ్యంతో మఱి రచన సాగించలేని స్థితిలో పడి మరణించి ఉండవచ్చు. ఏదైనా ఒకటే. ఆ నన్నయ రచనను ఎఱ్ఱన అందుకో వలసి వచ్చింది. అందుకొన్నాడు. ఎలా? ఆయన చేసిన చమత్కారం చూడండి. నన్నయ ప్రారంభించిన శారద రాత్రుల వర్ణనను ఆయన మఱి కొంచెం పొడిగించి ఉండవచ్చును. కాని, అలా చేయలేదు. అరుణోదయ వర్ణనతోనే ప్రారంభిం

చాడు. అంటే చాలా మంది ఎఱ్ఱన నన్నయకు పట్టిన గతే తనకు పడుతుందని భయపడి యెఱ్ఱన అలా చేశాడని అనే వాళ్ళున్నారు. కానీ, ఆయన భయపడ్డాడనేది అబద్ధం. ఎందు కంటే, "ఇక్కడ నుండి నేను వ్రాస్తున్నాను సుమా" అని ఆయన చెప్పుకోవలసి ఉంది. కాని, 'తద్రచనయకా' వ్రాశా నని చెప్పుకొన్నాడు గాబట్టి. 'ఇక్కడ నుండి నేను వ్రాస్తు న్నాను. సుమా ! అని వాచ్యంగా చెప్పుకోవడం కూడా సబబు కాదు. కాదని ఒకవేళ చెప్పుకొన్నా వట్టి మాటలతో చెబితే తరువాతి కాలంలో లేఖకు లెవరైనా ఆ మాటలు తీసేస్తే, లేక వాటిని పొరపాటున మఱోచోట పెట్టడం తట స్థిస్తే తన గతేమిటి ? అందుచేత ఎవ్వరూ మార్చడానికి వీలులేనంత చమత్కార భరితంగా తన కవితా ప్రారంభాన్ని గుఱించి యెఱ్ఱన యీ పద్యంలో చెప్పక చెప్పుకొన్నాడు. అరుణ శబ్దానికి ఎఱుపు రంగని అర్థం. అది యెఱ్ఱన పేరుకు సూచకం. ఆ పదం సరిగ్గా సూర్యోదయ వర్ణనకు అతుకు తుంది. అందుకే నన్నయగారి రాత్రిలో ప్రవేశించకుండా ఎఱ్ఱన ఆ రాత్రిని తెల్లవార్చాడు. అంతేకాదు, నన్నయగారు వర్ణించిన రాత్రి తెల్లవారలేదు-అంటే, భారత రచన ఆగి పోయిందని అర్థం. ఆ రాత్రిని యెఱ్ఱన తెల్లవార్చాడంటే భారత రచన ఆగిపోలేదు, కొనసాగిందని - అర్థం. కాబట్టి ఎఱ్ఱన తప్పని సరిగా సూర్యోదయ వర్ణనతోనే యెత్తుకోవలసి

ఉంది. ఎత్తుకొన్నాడు. మహాకవుల రచనల్లో ఇటువంటి మర్మాలెన్నో చోటు చేసుకుంటుంటాయి.

ఇకపోతే యీ రచన ఎఱ్ఱన యెప్పుడు చేశాడో, ఎందుకు చేశాడో, రాజరాజ నరేంద్రునికే దాన్నెందుకు అంకితం చేశాడో ముందు పుటల్లోనే చెప్పాను. ఈ అరణ్యపర్వ శేషాన్ని ఆయన నన్నయ రచనతో కలిపే వ్రాశాడు. అయితే తన రచన నన్నయ రచనతో భేదించదా? అంటే ప్రయత్నించి తత్కవితారీతియుఁ గొంతదోప. దద్రచనయకా నారణ్య పర్వశేషం పూరించినట్లు చెప్పుకొన్నాడు. అయితే నన్నయ కవితారీతి ఎఱ్ఱనార్యుని కెలా పట్టువడింది? అంటే అందు కెఱ్ఱనే సమాధానం చెప్పాడు. "నన్నయ భట్ట మహా కవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ జెందుట"యే అందు లకు కారణమని ఎఱ్ఱాప్రెగడ వక్కాణ.

ఈ విషయాలన్నీ యిలా ఉంటే, అరణ్యపర్వ శేషం తన నాటికి మిగిలిఉండగా ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాయలేదనీ, నన్నయ అరణ్యపర్వం కూడా పూర్తిగా వ్రాస్తే, కొన్నాళ్ళ తర్వాత అందులోని కొంత భాగం పాడుకాగా, ఆ భాగాన్నే ఎఱ్ఱన పూరించాడనీ శ్రీ శతఘంటం వేంకట రంగశాస్త్రిగారు ఒక వాదాన్ని లేవదీశారు. దీనికి ఉత్పన్న వాదమని పేరు. ఇదిలా ఉండగా క్రీ. శ. 1924 (భారతి **April**) లో శ్రీ నడ

కుదుటి వీరరాజుగారు ఎఱ్ఱన సగభాగాన్ని పూరించడం కూడా పూర్తిగా చేయలేదనీ నన్నయ అరణ్యపర్వం పూర్తిగా వ్రాస్తే, అందులో కొన్ని భాగాలను చెదలు తిన్నాయనీ, ఆ చెదలు తిన్న భాగాలనే ఎఱ్ఱన పూరించాడనీ మరో వాదం లేవదీశారు. దీనికి శిథిల పూరణవాదమని పేరు. ఈ వాదాలలో ఏమైనా సారముందేమో కొంచెం పరిశీలిద్దాం. వేంకట రంగ శాస్త్రిగారి వాదం ప్రకారం అరణ్యపర్వంలో కొంత భాగం ఉత్సన్నమైతే దాన్నే ఎఱ్ఱన్న పూరించాడనుకొంటే, నన్నయ భారతానికి 11 వ శతాబ్దం నుండి 14 వ శతాబ్దం వరకూ ఒకటే ప్రతి ఉందని చెప్పవలసి వస్తుంది. అది కుదరదు. పోనీ, ఎక్కువ ప్రతులున్నా యనుకొంటే, ఆ యన్ని ప్రతుల్లోనూ కొంత భాగం పోవడం, ఆ పోయిన భాగం అన్ని ప్రతుల్లోనూ సరిగా ఒకటే కావడం అసంభవం. అందుచేత ఈ వాదంలో ఏమీ ససి లేదు. శ్రీ వీరేశలింగం పంతులుగారు కూడా తమ కవుల చరిత్రలో ఈ వాదాన్ని నిరాకరించారు.

ఇక పోతే శిథిల పూరణ వాదం. ఈ వాదం మఱీ ఘోరం. పై వాదంలో లాగే దేశంలో నన్నయ భారతాని కొకటే ప్రతి ఉన్నదనీ, అలాకాక ఎక్కువ ప్రతులుంటే అన్ని ప్రతుల్లోనూ చెదలు సరిగ్గా అవే మాటలను తిన్నాయనీ

చెప్పుకోవాలి. పైగా, అక్కడక్కడా కొన్ని మాటలను మాత్రం వ్రాసి, అరణ్యపర్వ శేషాన్ని తాను పూరించినట్లు ఎర్రాప్రెగ్గడ గొప్పగా చెప్పుకొన్నాడనీ అనుకోవాలి. అది పొసగదు. అందుచేత ఈ శిథిల పూరణ వాదం కూడా అర్థ రహితంగానే పండితలోకం నిర్ణయించింది. కనుక నేను ముందు పుటల్లో వివర్ణించినట్లు ఎర్రన అరణ్యపర్వ శేషాన్ని అనన్య సామాన్యమైన ప్రతిభా విశేషంతో రచించా డనీ, అది తన రచన అని తన రచనా ప్రారంభంలోనే చమత్కార భరితంగా చెప్పుకొన్నాడనీ అనడమే సత్యం.

పైగా భాషా విషయకమైన ఆధారాలను పురస్కరించుకొని చూస్తే నన్నయ రచనకూ, ఎర్రన భారత రచనకూ ఉన్న తేడాలు స్పష్టమై, అరణ్యపర్వ శేషం ఎర్రన స్వతంత్ర రచన అని స్పష్టపడి పోయింది.[1]

నన్నయ తిక్కనల లాగానే ఎర్రాప్రెగ్గడ కూడా భారతాన్ని కావ్య దృష్టితోనే ఆంధ్రీకరించాడు. సంస్కృత భారతంలో కనిపించే అసంబద్ధత, పునరుక్తి, అనవసరమైన పెంపు తెలుగులో దీక్షగా పరిహరింపబడ్డాయి. ఎర్రన దృష్టి

1. చూడు - **"A critical study of Errapeg gada's works" - 1964 - V. Ramachandra, unpublished Ph. D. Thesis S. V. university.**

కళాదృష్టి. ఆ దృష్టితో అరణ్యపర్వ శేషాన్ని ఒక మంచి కావ్యంగానే రూపొందించాడు. ఆయన అరణ్యపర్వశేష రచన కాధారమయిన సంస్కృతభారతప్రతి దాక్షిణాత్య ప్రతియే. ఎఱ్ఱన తన రచన లన్నింటా పాటించింది వర్ణ నాత్మక పద్ధతే. తన పరిశీలనా శక్తి వల్ల, విమృశ్యకారిత వల్ల ఆయన అన్ని విషయాల్లోనూ ఔచిత్యాన్ని సాధింపగలిగాడు. ఆయన మూలాన్నెప్పుడూ నిర్లక్ష్యం చెయ్యలేదు. మూల రచనను గౌరవిస్తూనే స్వతంత్ర ధోరణిలో తన రచనను కొనసాగించాడు. ఆ విధంగా అరణ్యపర్వశేష రచనలో అతి విశిష్టమైన వర్ణనాత్మకతను సాధించి తద్రచన వల్ల ప్రబంధ పరమేశ్వరుడనే ఖ్యాతిని పొందాడు.

నిజానికి అరణ్యపర్వశేషంలోని శైలి రామాయణ హరివంశాలలోని శైలి కంటె రాటుదేలి కనిపిస్తుంది. అరణ్య పర్వ శేష రచనలో ఎఱ్ఱన నన్నయ్య ననుకరించినా, నాటకీయత కూడా అక్కడక్కడ కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఈ గుణం తిక్కన కాయన్ని చేరువ చేస్తుంది. ఈ రెండు గుణాలూ ఉండడం చేతనే యీ రచన అటు నన్నయ రచనతోనూ, ఇటు తిక్కన రచనతోనూ చక్కగా అతికిపోయింది. ఈ నాటకీయత కొకటి రెండుదాహృత్రులిస్తాను.

"ద్యూత వ్యాజమునన్ సంభాగణములో దుర్యోధ
నుండట్లు దు
ర్నీతిం గూరి యొనర్చినట్టి యఘముల్ నిష్కంప
ధైర్యోన్నతిన్
జేతః స్ఫారుఁడ వైననీ కొకనికిం జెల్లెన్ సహింపంగ వి
ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు నిక్కంబిట్టిరే
యెవ్వరున్"
( అర - 4 - 157 )

ఇవి శ్రీకృష్ణుడు ధర్మరాజుతో నన్నమాటలు. మఱొక పద్యం :

"ఇమ్ము నరేశ్వర యా తుర
గమ్ముల నీకార్యమయ్యెఁగాదే కడులో
భమ్మున నొండ్లవి సొమ్ములు
రమ్మనినన్ వచ్చునే యెరవు సతమగునే :
(అర, 4, 347).

వామదేవాశ్వ వృత్తాంతంలోనిదీ పద్యం. ఈ పద్యం నడకనుబట్టే యిందలి నాటకీయత స్పష్టమవుతుంది.

ఎఱ్ఱన వర్ణనాత్మకతకు గూడా అరణ్యపర్వశేషం నుండి స్థాలీపులాకంగానైనా ఉదాహరించడం భావ్యమను కొంటాను.

"కని యెంగోమల నీలమేఘ సుభగాకారున్
జటావల్కలా
జిన ధారున్ సితభూతి భూషితుని రాజీవాక్షుఁ
గల్యాణ కీ
ర్తనుఁగాకుత్థ్సకులప్రదీపకుని సీతా లక్ష్మణోపేతుస
న్మునిలోకార్చితు సత్కృపా భరణు రామున్ రాజ
చూడామణిన్"
(అర, 6, 309)

ఇది యెర్రన ఆరణ్యశేషంలో వ్రాసిన రామాయణం లోనిది. ఈ పద్యాన్ని పోతన తన భాగవతంలోని రుక్మిణీ కల్యాణంలో ఇలా అనుకరించాడు.

"కనియెన్ రుక్మిణిచంద్ర మండల ముఖుంగం
ఠీరవేంద్రావల
గ్నునవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘ
సంకాశదే
హునగారాతి గజేంద్రహస్తనిభ బాహుంజక్రిఁ
బీతాంబరున్
ఘనభూషాన్వితుఁగంబు కంఠువిజయోత్కంఠున్
జగన్మోహనున్."

ఇలా యెన్నయినా చూపవచ్చు. శ్రీనాథుఁడు, పోతన, పెద్దన వంటి మహాకవులెందఱో ఎఱ్ఱనగారి యీ అరణ్య పర్వశేషరచనలోని పలుకుబళ్ళను, కొన్ని కథలను అను సరించారు. అందుచేత అతడు మహాకవులకు మహాకవి.

ఈ మహానుభావుని తుది రచనే నృసింహ పురాణం. దీని అసలు పేరు లక్ష్మీనృసింహావతార కథ.

ఇది పేరుకే పురాణం. లక్షణాలన్నీ ప్రబంధానివే. ఐదాశ్వాసాల ప్రబంధం. ఇందులోని కథ ప్రహ్లాద చరిత్ర. ఈ కథకు ఒక మూలమంటూ లేదు. అష్టాదశ పురాణాల్లో ఈ కథ బ్రహ్మాండ, వామన, మత్స్య, హరివంశ, విష్ణు, భాగ వత పురాణాల్లో ఉంది. మరి, యిందులో ఎఱ్ఱాప్రెగ్గడ ఏ కథను మూలంగా స్వీకరించాడు అంటే, దేన్నీ యథాతథంగా మూలంగా గ్రహించలేదు. "బ్రహ్మాండాది పురాణోక్తంబయిన శ్రీ నరసింహావతారంబను పురాణంబు తెనుగు భాషఁ బ్రక టింపవలయు" అని మాత్రం అన్నాడు ప్రెగ్గడ. ఈ కథా స్వరూపాన్ని తానూహించిన విధానాన్ని ప్రెగ్గడ యిలా చాటు కున్నాడు.

"ఏనును బెద్దలచేయును
వీను లలరఁ దరతరంబ విన్న విధంబున్

మానసమునన్న తెలుఁగుఁ
గానుపునం గన్నక్రమముఁ గథనమొనర్తున్"
(నృ-1-24)

ఇది పేరుకే పురాణంగాని, నిజానికి ప్రబంధమని చెప్పానుగదా ! ప్రథమాశ్వాసంలో 81 గద్య పద్యాలయ్యే వరకూ కథరాదు. ఈ 81 గద్య పద్యాలలోనూ మహర్షుల కోరిక మీద సూతుడు అహోబలతీర్థ మాహాత్మ్యాన్ని చెప్పడం, గాలవుని తీర్థాటనం, సముద్ర శ్వేత ద్వీప, వైకుంఠ వర్ణనలూ, మహావిష్ణు వైభవ వర్ణనా చోటు చేసుకొన్నాయి. దీన్నిబట్టే యీాయనకున్న వర్ణనా ప్రీతి యెంతటిదో తెలుస్తుంది. అసలీ నృసింహ పురాణంలో మూడింట రెండు వంతులు ఎఱ్ఱనగారి స్వతంత్ర రచనే.

ఇందులోని ప్రథమ, ద్వితీయ, తృతీయ, పంచమాశ్వాసాల్లో కేవలం నామమాత్రంగా మాత్రమే భాగవత కథ అనుసరింపబడింది. నాలుగో ఆశ్వాసం మాత్రం సంస్కృత విష్ణుపురాణంలోని కథకూ, భావాలకూ చాలా సన్నిహితంగా ఉంటుంది. భాగవత కథను అవసర మనిపించిన చోట తన యిష్టాని కనుగుణంగా మలచుకొని, కథ పూర్తిగా పౌరాణికమే అయినా, పరిణతమైన తన వర్ణనాత్మక శైలితో దానికొక ప్రకృష్టమైన ప్రబంధ రూపాన్ని ప్రసాదించడానికే ఆయన

ప్రయత్నించాడు. ఆయన వర్ణనాత్మకశైలి యీ నృసింహ పురాణంలో పరాకాష్ఠను పొందిందని చెప్పవచ్చు.

ఎర్రాప్రెగ్గడ మీద తిక్కన భారత ప్రభావం అమేయంగా ప్రసరించింది. దానితో తిక్కన కవితా లక్షణాలు కొన్ని ఎర్రాప్రెగ్గడ కలవడ్డాయి. అందువల్ల ఆయన సాహితీ మూర్తియొక్క విలువ యెంతో పెరిగింది. నన్నయ తిక్కనలను గుఱించీ, తన యభీష్టసిద్ధిని గుఱించీ యీ కృత్యాదిలో ఆయన యిలా అన్నారు.

"భాసుర భారతార్థముల భంగులునిక్కమెఱుంగ
నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసమునిప్రణీత పరమార్థము తెల్లఁగఁజేసినట్టి య
బ్జాసన కల్పులందలఁతు నాద్యులనన్నయ తిక్క
నార్యులకున్." (నృ. పు. పీఠిక -9)

"కృతికి విభుండు శ్రీ విభుఁడుకీర్తన పావనమైన
తద్గుణ
స్తుతికృతి, విష్ణుదాసులు యశోనిధులూర్జిత పుణ్యు
లుత్తముల్

కృతిఁగొనియాడువారు కృతకృత్యుఁడనైతి మదీయ
వాంఛిత
ప్రతతికిఁ జెందఁగల్వ తరుపాకము శ్రీకరకావ్య
రూపతన్."
(నృ. పు. పీఠిక - 28)

ఈ క్రింది పద్యం ఆయన వినయసంపదకు తార్కాణ.

"మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి
గ్రమ్మరా
యంచలు గూయఁ గ్రౌంచమును నవ్వలిఁ
గూయఁగడంగు భంగిఁబ్రౌ
ఢాంచిత శబ్ద దాయలు మహాకవు లాద్యులు
కావ్యశయ్యగీ
లించిన కీర్తిసంగ సుఖలీలకు నేనును గాంక్షఁజేసితిన్"
(నృ. పు. పీఠిక - 13)

ఎఱ్ఱనగారి నృసింహపురాణ ప్రభావం పోతన మీద ప్రగాఢంగా కనిపిస్తుంది. నృసింహ పురాణంలోని యెన్నో పద్యాలను గూడ పోతన తన భాగవతంలోని ప్రహ్లాద చరిత్రలో అనుకరించాడు. ఈ ఎఱ్ఱన పోతనలు తమ హరి వంశ భాగవతాల్లో ఒకే రకమైన కథలనెన్నింటినో వ్రాశారు.

ఈ యిద్దఱు కవులనూ పోల్చి చూచినప్పుడు ఎఱ్ఱన నిగ్రహ గుణసంపన్నుడుగానూ, పోతన భావావేశపరుడుగానూ కనిపిస్తారు.

ఈ నృసింహావతార ప్రబంధం అతిమనోహరమైన కవిత్వానికి నిలయం. ఇందులోని తెనుగు నుడికారపు సొగసులూ, పద్యాల కూర్పు ఎంతో హృద్యంగా ఉంటాయి. కొన్ని ఉదాహృతులు చూపక పోవడం న్యాయం కాదను కొంటాను.

ఉ॥ "పొందవు దుఃఖముల్ భయము పొందదు పొందదు
దైన్యమెమ్మెయిన్
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు
పొందు సంపదల్
పొందు సమగ్ర సౌఖ్యములు పొందు సమున్నత
కీర్తు లెందుగో
విందు పదారవింద పదవీ పరిణద్ధ గరిష్ఠ చిత్తులన్."
(నృ. పు. ద్వి- 31.)

విష్ణు భక్తులైన వాళ్ళకు కలిగే మేలు ఈ పద్యంలో మనోహరంగా ఉల్లేఖింపబడింది.

ఈ క్రింది పద్యంలో ఎర్రన సూర్యోదయవర్ణన నెంతో సహజంగా చేసి యున్నాడు.

"అలినీమంజులగీతులుం బటు తరంగాలోల
నాదంబులున్
విలసత్కైరలతా వికీర్ణ సుమనో వృష్టి
ప్రచారంబులుం
గలహంసీ హసితానులాపములునై గంభీర
పద్మాకరం
బులు గోకద్వయ సంగమోత్సవములం బొల్పారెఁ
గాల్యంబులై."
(నృ. పు. 3, 114)

క్రింది పద్యంలో ఎర్రాప్రెగ్గడ హిరణ్యకశిపుని పాత్రను చిత్రించిన విధానం చూడవచ్చు.

సీ. "తపముల గ్రుస్సిన తపసుల బట్టి తె
ప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు
మోదంబుతో నశ్వముఖులలాయంబులఁ
గట్టి బొక్కసనియలఁ గవణయెత్తు

భుజగేశ్వరుల శిరంబుననున్న మణులూడ్చి
కొమరార వత్రువగుండు లెత్తుఁ
జెలఁగి గంధర్వుల చేతి వీణెలు పిశా
చుల కిచ్చి పాడించి చూచి నవ్వు

గీ. ఖడ్గములుఁ బాదుకలు ఘుటికములు నపహ
రించి సిద్ధ పుంగవుల గారించుచుండు
భువన బాధలు దనకిట్లు ప్రొద్దుపోక
లుగ సురారాతి పేర్చె నుల్లోకుఁడగుచు"

(నృ. పు. ద్వి. - 127)

ఇవి దిక్ప్రదర్శనంగా తెలిపిన ఉదాహృతులుమాత్రమే. నృసింహ పురాణంలోని ప్రతి పద్యమూ ఒక రసధుని. తెలుగు నుడికారపు సొగసులకు రసపరిపోషణకు, పాత్ర చిత్రణకు, శైలీవిన్యాసానికీ నృసింహ పురాణం వరమో దాహరణమని చెప్పవచ్చు. కావ్య రచనలో ఎఱ్ఱనకు గల శక్తులన్నీ నృసింహ పురాణంలో కేంద్రీకరింపబడి ఉన్నాయి. అందుకే నృసింహ పురాణం అంత రమణీయమైన ప్రబంధంగా రూపొందింది.

## 3

ఇక మిగిలింది యెఱ్ఱాప్రెగడ జీవితంలో మూడవదశ. అంటే ఆయన్ని ఆదరించిన ప్రభువైన ప్రోలయ వేమారెడ్డి క్రీ. శ. 1353 లో మరణించిన తరువాత ఆయన గడిపిన జీవితం. ప్రోలయ వేముని మరణానంతరం ఎఱ్ఱాప్రెగ్గడ యేమయ్యాడు ? బ్రతికే ఉన్నాడా లేడా? బ్రతికుంటే వేముని తర్వాత యెన్నాళ్ళు జీవించాడు ? ఈ ప్రశ్నలన్నింటికీ లభిస్తున్న శాసనాది ఆధారాలను పురస్కరించుకొని సహేతుకమైన సమాధానాలిచ్చి, సత్యాన్ని తేల్చవలసి ఉంది. శ్రీ నోరి నరసింహశాస్త్రి మొదలైన పండితులు కొందఱు ప్రోలయ వేముని మరణానంతరం ఎఱ్ఱన కొంతకాలం జీవించి ఉన్నాడని విశ్వసిస్తున్నారు. శ్రీ నిడుదవోలు వెంకటరావువంటివారు వేముని జీవిత కాలంలోనే యెఱ్ఱన మరణించినట్లు వాదించారు. ఈ వాదాలలో ఏది యెంతవఱకూ నిజమో సహేతుకంగా క్రింద చర్చిస్తాను.

క్రీ.శ. 1364 లో (శా.శ.1286) అనపోత అనవేమారెడ్లు వేయించిన దాన శాసనం ఒకటున్నది. దానికి కొల్లూరు శాసనమని పేరు.[1] ఈ శాసనం అనపోతారెడ్డి రాజ్య

1. 2. చూడు - రెడ్డి సంచిక-**Appendix - page - 2**

కాలం ముగిసి, అనవేమారెడ్డి పాలన ప్రారంభమయ్యే సమ యంలో వేయబడింది. అనపోత, అనవేమా రెడ్లిరువురూ "యఱ్ఱయప్రెగడ"గారికి మఱికొందఱు బ్రాహ్మణులతో గలిపి కేసరిపాటి యాభై పుట్ల చేను దానమిచ్చి, దాన్ని కొల్లూరుతో కలిపినట్లుగా యీ శాసనం తెలుపుతున్నది. ఆ శాసనం ఇది.

"అనవేమారెడ్డి గుంటూరు జిల్లా యిలాకా తెనాలి తాలూకాలో చేరిన మం॥ కొల్లూరులోవున్న తామ్రశాసనం" ॥సం॥.

"యఱ్ఱయ ప్రెగడగారికి తాడినగరపు పోలమున ఇరుపుట్టి 57 వేయారి పొలాన 51 బెరసి కేసరిపాటి 53 కంద్రికె ఏతద్విశేషణాది లిఖితేభ్యోఽస్య ఏకైక భాగినః సర్వే శూకాధ్యాపకాః అస్య గ్రామస్య సీమా చిహ్నాని తూర్పునకు ............యీ రాజ తమ్ముడు అనవేమభూపతి యజ్ఞ సాలకె వేమూరి తూర్పు పొలానను, పదిహేను పుట్ల క్షేత్ర మున్నూ తాడినగరం పొలం చుట్టునాను వాగు వెంట ముప్పదేను పుట్ల క్షేత్రమున్నూ బెరసి కేసరిపాటి యాభై పుట్ల చేను ధారవోసి యిచ్చి యీ పూరనే కలిపెను." ఇది యీ శాసన భాగం.

ఈ శాసనంలో మనకు 'య్రరయ ప్రగడ' పేరు కనిపిస్తున్నది. ఈతడెవరై యుండవచ్చును? శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఈ వ్యక్తి శంభుదాసుడైన యెఱ్ఱాప్రెగ్గడ కాడనీ, ఆయన మనుమడైన మఱో యెఱ్ఱాప్రెగ్గడ అనీ వ్రాక్రుచ్చారు. వారి అభిప్రాయం తప్పనీ, యీ 'య్రరయ ప్రగడ' శంభుదాసుఁడేననీ క్రింది కారణాలనుబట్టి నిర్ణయించవచ్చు.

మన సాహిత్య చరిత్రలో ఎఱ్ఱన నామధేయులు చాల మంది ఉండవచ్చు. కాని ఎఱ్ఱాప్రెగ్గడ నామధేయం ఒక్క శంభుదాసునికే ప్రసిద్ధం. ఒక్క సాహిత్య రంగంలోనే కాదు, రాజకీయ రంగంలో కూడా ఎఱ్ఱనకు సమకాలికులైన వాళ్ళెవ్వరూ ఆ పేరుతో ప్రసిద్ధులైన వాళ్ళు లేరు. అందుచేత కొల్లూరు శాసనంలో పేర్కొనబడ్డ ఎర్రాప్రెగడ శంభుదాసుడైన ఎఱాప్రెగడ కాదని నిరాధారంగా త్రోసిపుచ్చి, అంతకంటె నిరాధారంగా ఆయన మనుమడింకొక ఎఱాప్రెగ్గడ ఉన్నాడని చెప్పడం, అతనికే యీ యాభై పుట్ల చేను ఇవ్వబడిందని చెప్పడం ఒకదానికొకటి పొత్తు కుదరని విషయాలు.

ఒక వేళ మీది శాసనంలోని పేరు ఎఱ్ఱాప్రెగడ మనుమనిదే అని వాదం కోసం ఒప్పుకొన్నా, అతడేవిధంగా ప్రఖ్యాతుడు? అతనికీ అనపోత అనవేమారెడ్లకూ ఉన్న సంబంధమేమిటి? అతనికాదానం ఎందుకు ఇవ్వబడింది? ఎఱ్ఱాప్రెగ్గడకు మనుమడున్నాడనడానికి నిదర్శనాలేవి? ఉంటే అతని పేరు కూడా ఎఱ్ఱాప్రెగడే అని యెలా తెలుసు? ప్రతి మనుమడూ తాతపేరిట వ్యవహరింపబడక పోవచ్చుననడానికి ఎఱ్ఱన వంశ వృక్షమే నిదర్శనం. ఉదాహరణకు భీమ మనుమడు ఎఱపోత సూరి. ఆయన మనుమడు ఎఱ్ఱాప్రెగ్గ తాతగారి 'సూరి' మనుమనికి రాలేదు. అలాగే ఎఱ్ఱన కొక మనుమడుండి అతని పేరు కూడా 'ఎఱ్ఱన' అయి ఉండవచ్చు నన్నుకొన్నా, 'ప్రెగడ' శబ్దం కూడా ఉంటుందని ఎలా చెప్పగలం? అసలింతకూ ఏ ఆధారం లేకుండా ఎఱ్ఱనకొక మనుమడున్నాడనడమే నేల విడిచిన సాము. అందుచేత ఈ వాదం వట్టి పిప్పి మాత్రమే. కాబట్టి కొల్లూరు శాసనంలో పేర్కొనబడిన 'యఱ్ఱయ ప్రగడ' మన యెఱ్ఱాప్రెగ్గడే - అనడంలో సందేహంలేదు. అయితే క్రీ.శ. 1353లో ప్రోలయ వేముడు మరణించింది మొదలు ఈ దానాన్ని పరిగ్రహించే వఱకూ, అంటే క్రీ.శ. 1364 వఱకూ ఎఱ్ఱాప్రెగ్గడ అనపో

రెడ్డి కొలువులోనే ఉన్నాడో, కొలువు వదలి స్వతంత్రంగానే బ్రతికాడో చెప్పలేము. కాని, తొలినుండి ఎఱ్ఱాప్రెగడకు రెడ్డి రాజ్యంతో ఉన్న సంబంధాన్ని బట్టి చూస్తే, ప్రోలయవేముని మరణానంతరం ప్రెగడ అనపోతారెడ్డి కొలువులో కొనసాగి ఉంటాడనీ, అనవేమారెడ్డి పాలన చేపట్టేటప్పటికి ప్రెగ్గడ వృద్ధుడైనందువల్ల అతనికి విశ్రాంతి నివ్వగోరి అనపోత అనవేమా రెడ్లిరువురూ ఆయనకా భూదానంచేసి ఉంటారనీ భావించడమే సత్యమవుతుంది. తరువాత ప్రెగ్గడ కొల్లూరు లోనే ఉన్నాడో, చదలువాడలోనే స్థిరపడ్డాడో ఖచ్చితంగా చెప్పలేము.

ఈ యాధారాలను పురస్కరించుకొని చూస్తే యెఱ్ఱా ప్రెగడ అయన తాతగారివలెనే పూర్ణ పురుషాయుష జీవి అనే నమ్మకం కలుగుతుంది. కొల్లూరు దానాన్ని స్వీకరించిన తరువాత కనీసం అయిదారేండ్లు ఎఱ్ఱాప్రెగడ జీవించి ఉండ వచ్చుననుకోవచ్చు. మొత్తం మీద క్రీ.శ. 1364 వఱకూ ప్రెగడ జీవించి ఉన్నాడనే విషయాన్ని యీ కొల్లూరు దాన శాసనం రుజువు చేస్తున్నది. అందుచేత క్రీ.శ. 1280 నుండి 1364 వఱకే ఆయన జీవిత కాలమనుకొన్నా ఆయన దాదాపు 84 సంవత్సరాలు జీవించాడన్నది నిర్వివాదాంశం.

ఎఱ్ఱాప్రెగ్గడ తాతగారైన ఎఱపోత సూరి అన్నట్లుగా నృసింహ పురాణంలో వ్రాయబడిన మాటలనుబట్టి యెఱ్ఱ నకు ఆయన జీవిత కాలంలోనే శంభుదాసుఁడు, ప్రబంధ పరమేశ్వరుడు - అన్న ప్రశస్తి కలిగిందని తెలుస్తున్నది. ఎఱ్ఱన శివ పదాబ్జ సంతతాధ్యయన సంసక్తచిత్తుఁడు. పూజిత ధూర్జటి చరణాంబుజుఁడు. అతడెల్లప్పుడును శంభుదాసుఁడే గాని, యెప్పుడును విష్ణుద్వేషి మాత్రం కాదు. అందుచేతనే అతని బిరుదం శంభుదాసుడే అయినా గ్రహించిన కథలన్నీ విష్ణుకథలే. అతడు తాత్త్వికుడు. అతని జీవితమే హరిహరా ద్వైతానికొక వ్యాఖ్యానం. ఆయన మహాపండితుడు. గురు భక్తి తత్పరుఁడు, వినయోదయ సంభరితుడు. ధర్మాచరణైక శీలి. వినీతి పరుడు, సరళ హృదయుడు. సరళ సుందరమైన శైలే ఆయన కెక్కువ ఇష్టం. పల్లీ జీవితవిధానం పరిపూర్ణంగా తెలిసినవాడు. ఆ జీవితాన్ని కావ్యంలో మనోజ్ఞంగా చిత్రించి చూవగల నేర్పరి. ఒక ప్రభువు కొలువులో ఆస్థానకవిగాఉన్నా మహర్షివలె జీవితాన్ని గడపగలిగిన ధన్యుడాయన. అహంతా దూరుడు. విశిష్టమైన వ్యక్తిత్వం, విశ్వజనీనమైన కళా వైభవం ఏకీభవించిన మూర్తి, యుగకర్త. మహాతేజస్వి,

ఆదర్శ పురుషుడూ-అయిన ఆయన వ్యక్తిత్వం సాటిలేనిది. అటువంటి మహాకవి యీ జాతిలో పుట్టడం తెలుగు ప్రజల అదృష్టం.

రససిద్ధులు కవీశ్వరులు
రాలిపోని ధ్రువతారలు
జరామరణ భయ విరహిత
యశఃకాయ విరాజితులు.

